


# వైదిక శాన్తిపాఠం

## వైజ్ఞానిక వ్యాఖ్య




మంత్రకర్త :

'ఓ౩మ్' నామక సర్వాంతర్యామి

వ్యాఖ్య :

**సుమ్నార్థి**

(డా. కోడూరి సుబ్బారావు)

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ




ఓ3మ్ శన్నోమిత్రః శంవరుణః। శన్నో భవత్వర్యమా ।
శన్న ఇంద్రో బృహస్పతిః। శన్నో విష్ణురురుక్రమః। నమో బ్రహ్మణే,
నమస్తే వాయో। త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి । త్వామేవ ప్రత్యక్షం
బ్రహ్మ వదిష్యామి! ఋతం వదిష్యామి। సత్యం వదిష్యామి।
తన్మామవతు। తద్వక్తార మవతు। అవతు మామ్। అవతు వక్తారమ్ ।
**ఓ3మ్ శాంతిః శాంతిః శాంతిః**

– తైత్తరీయోపనిషత్తు (1-1)

ఓ సర్వాంతర్యామీ! నీ కృపవలన మిత్రావరుణలవంటి మా ప్రాణాపానములు మాకు సుఖశాంతులను కలిగించు గాక! అర్యములవంటి నేత్రాలు మాకు సుఖములను కలిగించునుగాక! కాళ్ళు చేతులు బలముకలవై మాకు తోడ్పడును గాక! మా బృహస్పతులు (ఆచార్యులు) మాకు శుభములు కలుగునట్లు బోధింతురు గాక!

అన్నిటికన్న గొప్పవియగు బ్రహ్మకు (పరమాత్మకు), ఆయనిచ్చిన వేదమునకు మా నమస్సులు. ఓ వాయువా – అత్యంత బలశాలివగు సర్వేశ్వరా! నీకు మా వందనములు. నీవే ప్రత్యక్ష బ్రహ్మవు. నీవే ప్రత్యక్ష బ్రహ్మమని ప్రవచింతుముగాక! ఋతములనే – వేద శాస్త్రాల కనుకూలమైన వానినే మేము ఉపదేశింతుముగాక! మనో వాక్కాయములతో సత్యమునే నమ్ముదుము గాక! పలుకుదుము గాక! ఆచరింతుము గాక! ముఖ్యంగా ఆ సత్యకథనమే నన్ను రక్షించును గాక! సత్యోపదేశకులందరిని రక్షించును గాక!

*(గమనిక :– ఇచట 'వాయు' వంటే మనం పీల్చుకునే గాలికాదు. ఏకం సత్ విప్రా బహుధా వదన్తి.... (ఋ 1-164-46) లో చెప్పినట్లు సర్వ వ్యాపక ఏకేశ్వరునికే అనేకానేక నామములు. అందులో 'వాయుః' ఒకటి).*



# వైదిక శాన్తిపాఠం

## వైజ్ఞానిక వ్యాఖ్య



మంత్రకర్త :

'ఓమ్' నామక సర్వాంతర్యామి

వ్యాఖ్య :

సుమ్నార్థి

(డా. కోడూరి సుబ్బారావు)

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

గాయత్రీ గ్రంథమాల : 60

**వైదిక శాంతిపాఠం**

ప్రథమ ముద్రణ : ప్రతులు 1000



సృష్టి సంవత్సరము = 196,08,53,116 (మన్వంతర సంధిరహితము)
197,29,49,116 (మన్వంతర సంధిసహితము)

విక్రమాబ్దము : 2072

దయానందాబ్దము = 192

శ్రీ మన్మథ నామ సంవత్సరము, జేష్ఠ శు॥ పూర్ణిమ
తెలంగాణ ఆవిర్భావదినం (2-6-2015)

మూల్యము : **రూ. 20-00**
(తపాలా ఖర్చులు అదనం)

**ప్రతులకు :**

**1)** డా॥ కోదూరి సుబ్బారావు, వైదిక వానప్రస్థాశ్రమం,
హనుమాపురం, భువనగిరి గంజ్ - 508 117,
సెల్ : 9908994084, 9290604641.

**2)** **గాయత్రీ ఆశ్రమ ట్రస్టు - ఆర్య సమాజము మేడిబావి,**
12-10-586/6, ఇందిరానగర్, రోడ్ నెం. 2,
వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061, సెల్ : 9848011073.

**3)** **ఆర్యసమాజము - సీతాఫలమండి,** సికింద్రాబాద్ - 500 061.
ఫోన్ : 27071816, 69990967, 9246174018.

**4)** ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకోవటానికి
https://sites.google.com/site/rithamhyd.

**డి.టి.పి. & ప్రింటింగ్ :**

**విక్రాంత్ ప్రింట్ హౌస్,**

వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061.

ఫోన్ : 9705085608.



## ప్రాక్కథనం (FOREWORD)

# సా మా శాంతిరేధి (యజుర్వేదం)

**సృష్టిలో నెలకొనిఉన్న శాంతి నాలో ప్రవేశించి వర్థిల్లును గాక!**

సర్వవ్యాపకుడు, సర్వంతర్యామి, సర్వశక్తిమంతుడు అయిన పరమేశ్వరుడు ఎవరి సహాయం లేకుండా తానొక్కడే ఈ విశాల విశ్వాన్ని సృజించి నియమించి నడిపిస్తున్నాడు. భూమివంటి గ్రహాలపై వివిధ ప్రాణులను సృజించి పాలించి పోషిస్తున్నాడు. తనలోని సూక్ష్మ పరమాణువులను (సత్వ రజ తమ అణువులను) వివిధ నిష్పత్తులలో కలిపి స్థూలంచేస్తూ మూలకాలను (**Elements**)ను, వాటితో మనకు కనబడే ఈ సృష్టిని గావించాడు. ఈ అద్భుతాద్భుతమైన సృష్టి అంతా జీవులమైన మన కొరకే. ఇందులో నెలకొన్న శబ్ద స్పర్శ రూప రస గంధాదులన్నీ మన సుఖంకొరకే. వాటిని గ్రహించగల ఇంద్రియాలను, మనస్సును మనకొరకు నిర్మించి యిచ్చాడు. అందువల్లనే మనం సృష్టిలోని సంపదలను భోగాలను అనుభవించ గలుగుతున్నాము. మానవులమైన మనకు విశేషంగా 'బుద్ధి' అనే అంతరింద్రియాన్ని నిర్మించి యిచ్చిందికూడా సృష్టికర్తనే. ఆ బుద్ధితో మనం సృష్టిలోని పదార్థాలను మనకు అనుకూలంగా మార్చుకొని చాలా చాలా విశేష సుఖాలను అనుభవిస్తున్నాము.

సృష్టిని పరిశీలించి చూస్తే అంతటా అన్నిటా శాంతి నెలకొని ఉంది. అంతటా సృష్టి నియమాలు గోచరిస్తాయి. ఈ శాశ్వత సార్వత్రిక నియమాలకు వేదం 'ఋతము' అని పేరు పెట్టింది. ఆ శాశ్వత నియమాలు ఏమిటేమిటో సృష్టికర్త వేదంద్వారా ఆది ఋషులకు తెలిపాడు. ఆ ఋతాలను తెలిపేదే ఋగ్వేదం. అది ఒక పదార్థవిజ్ఞాన శాస్త్రం. అందులో సృష్టి నియమాలన్నీ బీజరూపంలో ఉన్నాయి. వాటిని మనన చింతన పరిశోధనలుచేసి మన ఋషులు ఆయుర్వేద ఖగోళ విజ్ఞానాది గ్రంథాలు వ్రాశారు. వాటిని ఎవరు చక్కగా అర్థం చేసుకొని ఆచరిస్తారో వారికి సుఖం, సంతోషం, ఆరోగ్యం, ఆనందం, శాంతి కలుగుతాయి. వాటిని సరిగా అర్థం చేసుకోలేకపోయినా లేదా వాటిని దుర్వినియోగం చేసినా అవి ఉగ్రరూపం ధరిస్తాయి. వాటినే మనం ప్రకృతి ఉపద్రవాలంటున్నాము.

"సత్యం బృహత్ ఋతముగ్రం" అంటుంది అథర్వవేదీయ పృథివీ సూక్తం. అంటే – సత్యస్వరూపుడైన పరమాత్మ బృహత్ – అన్నిటికన్నా గొప్పది, పెద్దది. ఆయన ఏర్పరిచిన ఋతాలు (సృష్టి నియమాలు) ఉగ్రంగానే ఉంటాయి అని అర్థం. తెలిసి నిర్లక్ష్యంగా అగ్నిలో చెయ్యిపెట్టినా, తెలియక పెట్టినా అది కాలుస్తుంది కదా! బాధను, అశాంతిని కలిగిస్తుంది కదా! కనుక, మనం పరమాత్మను తెలుసుకోవటం ఎంత అవసరమో ప్రకృతి నియమాలు, వాటితో ఏర్పడిన పదార్థాల గుణధర్మాలు తెలిసికోవటంకూడా అంతే అవసరం. అప్పుడే మనకు భౌతికశాంతి, మానసికశాంతి, ఆత్మికశాంతి లభిస్తాయి.

వేదాలలో శాంతిని కోరుతూ ప్రార్థించే మంత్రాలు వందలకొలది ఉన్నాయి. సూక్తాలకు సూక్తాలుగా ఉన్నాయి. వాటిలో ఒక సూక్తానికి – అథర్వవేదీయ శాంతి సూక్తానికి నే నీమధ్య వైజ్ఞానిక వివరణ వ్రాశాను. దానిని మా సీతాఫలమండి ఆర్యసమాజంవారు ముద్రించి వితరణ చేశారు. దానిని చదివిన చాలా మంది బాగుందన్నారు. వేదమంత్రాలలో కేవలం ప్రార్థనలేగాక అందుకు మనవంతు చేయవలసిన కర్తవ్యాలు కూడా ఉపదేశింపబడతాయి. దయానంద మహర్షి అట్టి కొన్ని వేదమంత్రాలను నాలుగు వేదాలలో నుండి సేకరించి – సంకలనం చేసి "శాంతికరణమ్" అనే పేరుతో తమ 'సంస్కార విధి' గ్రంథంలో పొందుపరచారు. ఆ శాంతి మంత్రాలను శుభాశుభకార్యాలన్నిటిలోనూ పఠించవచ్చునన్నారు. స్వస్తితో బాటు శాంతినికూడ మనమంతా కోరుకుంటాము కదా!

ఆ శాంతికరణ మంత్రాలలో ఒక మంత్రం విశేషంగా గోచరిస్తుంది. దానిని ఆర్యులు ప్రతీకార్యం ముగింపులోను శాంతిపాఠంగా పఠిస్తారు ఆ విశేష మంత్రానికి కూడా వైజ్ఞానిక వ్యాఖ్య వ్రాస్తే బాగుంటుందని సంకల్పం కలిగింది. దాని కార్యరూపమే ఈ చిన్ని పుస్తకం. దీనిని మీరంతా చదివి మీ మీ అభిప్రాయాలు తెలుపగోరుచున్నాను. అవసరమైన మార్పులు, చేర్పులు చేసి రెండవ ముద్రణకు ప్రయత్నిస్తాను.

ఈ పుస్తక ముద్రణ ప్రూఫ్‌లు సరిచూసిన శ్రీ డి. గంగాధర్, శ్రీ నర్సయ్య, శ్రీ పూర్ణచంద్రరావు గార్లకు, విక్రాంత్ ప్రింట్ హౌస్ వారికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

**- సువ్యార్థి**

(డా. కోదూరి సుబ్బారావు)




# వైదిక శాంతిపాఠం

(వైజ్ఞానిక వ్యాఖ్య)

భారతీయులంతా శాంతికాముకులు. వారు తమకు, తమ కుటుంబాలకే గాక – బంధుమిత్రులకు, తోటి సమాజానికి శాంతి కలగాలని కోరుకుంటారు. ఈ శాంతికామన ఇంకా యింకా విశాలమై సమస్త మానవాళికి, సమస్త ప్రాణికోటికి విస్తరించాలంటుంది వేదం. ఇంతేగాక, ప్రాణులన్నిటిని మిత్రదృష్టితో చూడమంటుంది. ప్రాణమిత్రునివలె వాటికి సహకరించమంటుంది. ఈ క్రింది వేదమంత్రాన్ని పరిశీలించండి.

**దృతే దృంహ మా మిత్రస్య మా చక్షుషా**
**సర్వాణి భూతాని సమీక్షన్తామ్ ।**
**మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే ।**
**మిత్రస్య చక్షుషా సమీక్షామహే ॥**

– యజుర్వేదం (36–18)

హే దృతే దృంహ మా = ఓ అజ్ఞాననాశక సర్వాధార సర్వేశ్వర! నాలోని బలహీనతలన్నిటిని నశింపజేసి నన్ను దృఢపరుచుము.

మిత్రస్య మా చక్షుషా సర్వాణి భూతాని సమీక్షన్తామ్ = నీ ప్రేరణతో సమస్త ప్రాణులు నన్ను మిత్రదృష్టితో, ప్రేమతో చూచును గాక!

మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే = అట్లే, నేనునూ సమస్త ప్రాణులను మిత్రదృష్టితో చూతును గాక!

మిత్రస్య చక్షుషా సమీక్షామహే = మిత్రదృష్టితోనే – ప్రాణమిత్రులవలెనే మేము పరస్పరము వ్యవహరింతుము గాక!

అని భారతీయులు ప్రార్థిస్తారు. సంకల్పిస్తారు. అయితే ఈ మిత్రదృష్టి మనలో ఏర్పడాలంటే మనం గట్టి ప్రయత్నమే చెయ్యవలసి ఉంటుంది. ముందు మనలోని పరస్పర ద్వేషాన్ని పోగొట్టుకోవాలి. ద్వేషంపోతే మైత్రీ భావన దానంతటఅదే బలపడుతుంది. మనలో ఏ ఒక్కరిపై ద్వేషభావన ఉన్నా మనం శాంతంగా

ఉండలేము. మాటిమాటికి అదే గుర్తుకు వచ్చి మనకు మనశ్శాంతి లేకుండా చేస్తుంది. అట్లే, ఇతరులకు మనపై ద్వేషం ఉన్నా ఏదో భయం మనను వెంటాడుతుంది. అశాంతికి గురిచేస్తుంది. మనం అన్నిటికీ, అందరికీ దూరంగా ఉండగలమా? అంటే – అది మనకు సాధ్యం కాదు. మనం సామాజిక ప్రాణులం. సమాజంలో జీవించవలసిందే. తప్పదు.

కనుక, మనం నిత్యం ఆత్మపరమాత్మల జ్ఞానాన్ని మననం చేసుకుంటూ కొంతసేపు ఏకాంతంగా కూర్చోవాలి. మనం ఈ శరీరంకాదనీ, ప్రస్తుతం ఈ శరీరంలో ఉన్న జీవాత్మలమనీ గుర్తు చేసుకోవాలి. మననం చేయాలి. ఈ ఆత్మజ్ఞానాన్ని దృఢపరుచుకోవాలి. దీనితోబాటు సర్వంతర్యామియైన పరమేశ్వరుని స్వరూప స్వభావాలను కూడా గుర్తు చేసుకోవాలి. పరమేశ్వరుడు సర్వవ్యాపకుడనీ, అత్యంత న్యాయకారియనీ, అతని న్యాయం వెంటనే కనిపించకపోయినా ఆలస్యంగానైనా లేదా కాలాంతరంలోనైనా, మరొక జన్మలోనైనా అనుభవించవలసి వస్తుందనీ నమ్మకం పెంచుకోవాలి. ఉదయ సాయం సంధ్యాసమయాలలో సంధ్యావందనం చేసేటప్పుడు మనసా పరిక్రమ మంత్రాల ద్వార " **'యో అస్మాన్ ద్వేష్టి'** ఎవరు మమ్మల్ని ద్వేషిస్తున్నారో, **'యం వయం ద్విష్మః'** – మేము ఎవరిని ద్వేషిస్తున్నామో అట్టి మేమిరువురము మా ద్వేషమును **'తం వో జంభే దధ్మః'** – ఓ పరమేశ్వరా! నీ న్యాయరూప బాహువులకు అర్పించుచున్నాము. నీవే మాకు సరియైన న్యాయము చేయగలవని నమ్ముచున్నాము," అని మనస్ఫూర్తిగా ప్రార్థించాలి. నాలుగు దిక్కులలోనూ, పైనా క్రిందా ఎక్కడ మమ్ము ద్వేషించేవారున్నా అందరికీ నీవు న్యాయం చేయగల సమర్థుడవు" అని పై మాటలను ఆరు దిక్కులకు చెందిన ఆరు మంత్రాలతో ఆరు పర్యాయములు చెప్పుకోవాలి. దానితో మన మనస్సు తేలిక పడుతుంది. శాంతి చేకూరుతుంది.

**భౌతిక అశాంతికి కారణాలు :**

అశాంతి సామాన్యంగా మన మనస్సు ద్వారానే కలుగుతుంది. భౌతిక ప్రాకృతిక పదార్థాలవల్లా, ప్రాకృతిక దేవతలవల్ల కలిగే అశాంతి చాలా అరుదు. పరమేశ్వరుని శాసనంతో అవన్నీ నియమబద్ధంగానే ఉంటాయి. శాంతిగానే ఉంటాయి. ఈ క్రింది వేదమంత్రం ఏమి చెబుతున్నదో జాగ్రత్తగా గమనించండి.

ఓం ద్యౌః శాన్తి రన్తరిక్షం శాన్తిః, పృథివీ శాన్తి రాపః శాన్తి రోషదయః శాన్తిః।
వనస్పతయః శాన్తి ర్విశ్వేదేవాః శాన్తి ర్బ్రహ్మ శాన్తిః, సర్వం శాన్తిః
శాంతిరేవ శాన్తిః సా మా శాన్తిరేధి ॥ - యజుర్వేదం (36-17)

ద్యులోకం శాంతిగా ఉంది. అంతరిక్షం శాంతిగా ఉంది. పృథివి శాంతిగా ఉంది. ఆపః (జలము) శాంతిగా ఉంది. ఓషధులు (కాయ పప్పు ధాన్యాలు, మూలికలు) శాంతిగా ఉన్నాయి. వనస్పతులు (మామిడి, రావి, కొబ్బరి మొదలగు చాలా పర్యాయాలు కాయల నిచ్చేవి) శాంతిగా ఉన్నాయి. విశ్వదేవతలు (విద్యావిజ్ఞానాలతో లోకోపకారం చేసే విద్వాంసులు) శాంతికొరకే ప్రయత్నించుచున్నారు. బ్రహ్మ (సృష్టికర్తచే యివ్వబడిన వేదం), దానికి అనుకూలంగా ఋషులు వ్రాసిన గ్రంథాలు అన్నీ శాంతి సందేశాన్నే యిస్తున్నాయి. సృష్టికర్తచే రచింపబడిన ప్రాపంచిక పదార్థాలన్నీ శాంతి కారకములే. ఏవో ప్రయోజనాల కొరకు రచింపబడినవే. అంతటా, అన్నిటా శాంతియే ఉంది. ఓ పరమేశ్వరా! ఆ పదార్థాలలో ఉన్న శాంతిని నాలో ప్రవేశింపజేసి వర్ధిల్లజేయుము.

పై మంత్రంలో ఉన్నవన్నీ చిన్నచిన్న వాక్యాలు. ఆ యా పదార్థాలన్నిటిలో పరమేశ్వరుడు వ్యాపించి అన్నిటిని నియమించి నడుపుచున్నాడు. అవన్నీ జీవులమైన మన సుఖశాంతుల కొరకే రచింపబడ్డాయి. అన్నింటిలోనూ శాంతి నెలకొని ఉంది. అప్పుడప్పుడు చాల అరుదుగా ప్రాకృతిక ఉపద్రవాలు కలిగినా అవి అంతకన్న ఎక్కువ ప్రమాదకర సంఘటనలు జరుగకుండా ఉండటానికే. మరి, శాంతి లేనిది ఎక్కడా? అంటే - అది మానవ మస్తిష్కంలోనే. ప్రాకృతిక దేవతలలో, పదార్థాలలో శాంతి ఉన్నది కనుకనే మన జీవితాలు ఇంతమాత్రమైనా సాగుతున్నాయి. లేకుంటే క్షణక్షణ గండంగా ఉండేది జీవితం.

నేటి భౌతిక అశాంతికి కారణం ప్రగతి పేరుతో జరుగుచున్న పారిశ్రామికీకరణ, పట్టణీకరణ. జీవులందరికీ మేలు జరగాలనీ, వాటికి సుఖశాంతులు ప్రసాదించాలనీ పరమేశ్వరుడు సృష్టికార్యమనే గొప్ప తపస్సును చేశాడు. అద్భుతాద్భుతమైన విశ్వాన్ని సృష్టించాడు. తనలో విడివిడిగా పడివున్న పరమాణువులను - సత్త్వరజస్తమస్సులను - ప్రొటాన్, ఎలక్ట్రాన్, న్యూట్రాన్-లను వివిధ నిష్పత్తులలో

కలిపి మేళవించి మూలకాలను (Elements) నిర్మించాడు. ఆ మూలకాలను వివిధరకాలుగా సమ్మిళితం చేసి వివిధ ప్రాపంచిక పదార్థాలను సృష్టించాడు. క్రమంగా భూమివంటి గ్రహాలను తయారుచేసి వాటిపై వృక్షజాతులను, భూచర జలచర వాయుచరాలను సృష్టించాడు. వీటిలో అత్యుత్తమ ప్రాణి మానవుడు. మానవప్రాణిలో అవయవాలు, ఇంద్రియాలు, మనస్సు వికసించి ఉంటాయి. వీటితో బాటు 'బుద్ధి' అని వ్యవహరించే మనస్సులోని ఒక ఉత్తమ భాగం వికసించి ఉంటుంది. బుద్ధి అంటే జ్ఞానాన్ని గ్రహించి, ఆలోచించి తన అవసరాలకు అనుగుణంగా పదార్థాలను, వ్యవస్థలను తయారు చేసుకోగల సామర్థ్యం. ఆ జ్ఞానాన్ని తోటి మానవులకు ఇవ్వగల వాక్శక్తి. ఆ బుద్ధితోనే మానవుడు భౌతిక ఉన్నతిని, సామాజిక ఉన్నతిని, ఆత్మిక ఉన్నతిని పొందగలుగుచున్నాడు. ఆ బుద్ధితోనే మానవుడు ప్రాపంచిక పదార్థాలలో నెలకొనిఉన్న శాంతిని గ్రహించి తనలో వర్ధిల్ల చేసుకోగలడు. అందుకనే పై వేదమంత్రం "సా మా శాన్తిరేధి – ఆ శాంతి నాలో చేరి వర్ధిల్లును గాక !" అని గట్టిగా సంకల్పించమంటున్నది.

ద్యులోకాలలోని అంటే నక్షత్రలోకాలలోని గ్రహ ఉపగ్రహాల గురించి మనకు తెలియదు కాని, మనమున్న ఈ భూగోళం మాత్రం అద్భుతాద్భుతంగా నిర్మింపబడింది. భూమి సూర్యునినుండి విడిపోయిన ఒక మండే గోళమైనా పరమేశ్వరుడు దీనిని చల్లబరచి, దీనిపై నీటిని, గాలిని సృష్టించాడు. అన్ని ప్రాణులకు మేలు చేసే వాతావరణాన్ని సృజించాడు. సూర్యుని నుండి వెలువడే అపాయకర కిరణాల నుండి ప్రాణికోటిని కాపాడటానికి ఓజోన్ (Ozone) పొరను నిర్మించాడు. ఈ భూమిలో మన కవసరమైన అన్ని రకాల ఖనిజాలను నిక్షిప్తం చేశాడు. మనకు లభించే సమస్త సంపదలు భూమినుండి వస్తున్నవే. కనుక భూమిని 'వసుధ' అంటాయి మన వేదశాస్త్రాలు. 'వసు' అనే సంస్కృత పదమునకు 'సంపద' అని అర్థం. అట్టి భూమి 23 1/2 డిగ్రీల ఏటవాలుగా ఉంటూ దీర్ఘవృత్తాకారంగా సూర్యుని చుట్టూ తిరుగుతున్నందున ఋతువు లేర్పడుతున్నాయని వైజ్ఞానికులంటున్నారు. ఇంతేగాక, ఇంత చక్కటి సమతుల్యతగల వాతావరణం ఈ సూర్యకుటుంబంలోని మరియే ఇతర గ్రహంపైనా లేదనికూడా అంటున్నారు.

అట్టి ప్రాణావసరమైన వాతావరణాన్ని మానవుడు ఇంద్రియలోలుడై అతి

ఆశలతో అతి కోరికలతో కలుషితం చేస్తున్నాడు. నాగరికత పేరుతో కొంత, అవసరం పేరుతో కొంత, అతి సుఖేచ్ఛతో కొంత అనేక రకాల పరిశ్రమలను, వాహనాలను నిర్మిస్తున్నాడు. భూమి నుండి లభించే సహజ వనరులను దుర్వినియోగం చేస్తున్నాడు. దుఃఖాలను, రోగాలను, బాధలను, అశాంతిని కొని తెచ్చుకుంటున్నాడు. ఆధునిక విజ్ఞానం తాత్కాలిక ఉపశమనాన్ని కలిగిస్తున్నదే కాని పర్యవసానం భయంకరంగా ఉంటున్నది. ఓజోను పొర పలుచబడటంతో ఇప్పటికే కొన్ని ప్రాణిజాతులు అంతరించి పోయాయట. ఇది యిట్లే కొనసాగితే క్రమంగా భూగోళం వేడెక్కిపోయి చాలా అనర్థాలు వస్తాయి. మరికొన్ని ప్రాణి జాతులు అంతరించిపోతాయి. వింత విచిత్రమైన రోగాలు, బాధలు వస్తాయి. ఎట్లో మన జీవితాలు గడిచిపోతాయికాని భావి తరాలవారి బాధలు శ్రుతిమించి పోతాయి. వారు మన తప్పిదాలను ఏకరవు పెట్టుకుంటూ విలపిస్తారు. మనను శపిస్తారు. తస్మాత్ జాగ్రత్త !

భూమిపై జరుగుచున్న ఉపద్రవాలకు చాలావరకు మానవులు చేస్తున్న పొరపాట్లే కారణం. కొన్ని మాత్రమే ప్రాకృతికాలు. పదార్థాల గుణగణాలను, వాటిలో నెలకొనివున్న నియమాలను సరిగా అర్థం చేసుకోగలిగితే ఉపద్రవాల ఉగ్రతను చాలావరకు తగ్గించవచ్చు. ప్రకృతిలో కొన్ని శాశ్వత నియమాలు నిక్షిప్తమై ఉంటాయి. వాటిని 'ఋతం' అంటుంది వేదం. ఆధునిక వైజ్ఞానిక పరిభాషలో వాటిని (Physical & Chemical Laws) అని చెప్పవచ్చు. నేటి వైజ్ఞానికులు వాటిని కనుగొనటానికే అహర్నిశలు కృషి చేస్తున్నారు. కొన్నిటిని కనుగొన్నారు. వాటితోనే ఎన్నో సుఖసాధనాలను ఆవిష్కరించారు. వారి కృషి ప్రశంసనీయమే. అభినందనీయమే. కాని, వాటివల్ల వాతావరణం కలుషితమౌతున్నది. వింత వింత రోగాలు పుట్టుకు వస్తున్నాయి. ముఖ్యంగా వారు వాడుచున్న ఇంధనాలు, ఖనిజాలు, ఎరువులు, పురుగుమందులు, రోగనిరోధకాలు, ఏంటిబైటిక్స్ మొదలగునవి పరిణామరూపంలో చాలా నష్టాన్ని, కష్టాన్ని కలిగిస్తున్నాయి. కాని, మన ప్రాచీన ఋషుల ఆవిష్కారాలు, ప్రయోగాలు ఏ ప్రాణినీ హింసించలేదు. వాతావరణాన్ని కలుషితం చెయ్యలేదు. అందుకు కారణం వారు అనుసరించింది వేదమార్గం – వేదం చూపిన జ్ఞాన మార్గం.

వేదం సృష్ట్యాదిలో ఆది మానవులకు సృష్టికర్త ప్రసాదించిన జ్ఞానం. ఆ ఆది మానవులలో యోగ్యులైన నలుగురు ఋషుల హృదయాలలో సృష్టి విజ్ఞానాన్నంతా

నాలుగు భాగాలుగా ఉపదేశించాడు. అగ్ని నామక ఋషికి ఋగ్వేదం, వాయునామక ఋషికి యజుర్వేదం, ఆదిత్య నామక ఋషికి సామవేదం, అంగిర ఋషికి అథర్వవేదం ఉపదేశించాడు. వీటిని మానవ మాత్రులందరికి ఉపదేశించండని వేదంద్వారా ఆదేశించాడు. ఆ వేదాదేశం ఎలా ఉందో చూడండి.

**ఓం యథేమాం వాచం కళ్యాణీమావదాని జనేభ్యః ।**

**బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ చ॥**

– యజుర్వేదం (26–2)

"ఓ వేద ఋషులారా ! మీకు నేను ఉపదేశించిన ఈ లోక కళ్యాణకర వేదవచనాలు (జనేభ్యః) జనులందరి కొఱకు చెప్పితిని. కనుక, మీరు ఈ వేదాలను బ్రాహ్మణ క్షత్రియులకు, శూద్రులకు, ఆర్యులకు (వైశ్యులకు) ఉపదేశించండి. ఇందు స్వజన పరజన భేదం కాని, స్త్రీపురుష భేదం కాని, పాపులు పవిత్రులు అనే భేదంకాని, పెద్ద చిన్న భేదం కాని చూపవద్దు. మానవ మాత్రులందరికి ఉపదేశించండి. తరతరాల ప్రజలలో ఈ జ్ఞానం ప్రవహిస్తూ ఉండాలి." ఇది సృష్టికర్త ఆదేశం. కనుక వేదాలను అందరూ చదువవచ్చు. చదివి ఆచరిస్తే పాపులు పవిత్రులౌతారు. పాపమార్గాన నడిచేవారు పవిత్ర మార్గంలో నడుస్తారు. పవిత్రులు మరింత పవిత్రులౌతారు. అల్పజ్ఞులు సువిజ్ఞులౌతారు. సువిజ్ఞులు మహాత్ములౌతారు. కనుక, వేదాలు అందరూ చదువాలి. ఆ విషయాలను గురించి ఆలోచించాలి. తర్కించాలి. సత్యాన్ని గ్రహించి అసత్యాన్ని (మూఢ నమ్మకాలను) త్యజించాలి.

వేదాలు సృష్టికర్త నుండి వచ్చిన జ్ఞాననిధులు. కనుక, వాటిలో పొరపాట్లు తడబాట్లు ఉండవు. అవన్నీ ఋతములు – సృష్టిలో నెలకొనివున్న శాశ్వత నియమాలు. అందుచేతనే మన పూర్వులు వాటిని జాగ్రత్తగా కాపాడుకుంటూ వచ్చారు. దానికి వారు వేదాన్ని కంఠస్థం చేశారు. పిల్లలకు 8వ సంవత్సరంలోనే ఉపనయనం చేసి వేదాలను వల్లెవేయించారు. ఇంతేగాక, వాటిలో ఇతరుల మాటలు కలిసిపోకుండా పదపాఠంగా, జటాపాఠంగా, ఘణాపాఠంగా రకరకాల పద్ధతులలో స్వర సహితంగా వల్లె వేయించి కాపాడారు. ఒక్కొక్క సూక్తంలో, మంత్రంలో ఎన్ని పదములున్నవో, ఎన్ని అక్షరాలున్నవో కూడా కంఠస్థం చేయించారు. అందువల్ల ఈశ్వరీయ జ్ఞానమైన వేదాలు మాత్రం ప్రక్షిప్తాలు లేకుండా – కపోల కల్పితాలు లేకుండా యథాతథంగా

ఉన్నాయి. ఇప్పటికినీ కొన్ని దేవాలయాలు, కొన్ని ఆశ్రమాలు వేదపాఠశాలలు పెట్టి పిల్లలచే వేదాలు కంఠస్థం చేయిస్తూ కాపాడుతూ వస్తున్నారు. వారంతా అభినందనీయులు.

ఇంతేగాక, మన పూర్వులు పిల్లలకు వేదవ్యాకరణాన్ని నేర్పి ఆ మంత్రాల అర్థాలను గ్రహించే సామర్థ్యాన్ని వారికి కలిగించారు. అందువల్ల వారు వేదాలను కేవలం కంఠస్థం చెయ్యటమేగాక వాటి అర్థాలను తెలుసుకుంటూ సృష్టి నియమాలను, పదార్థ గుణగణాలను తెలుసుకోగలిగారు. వారివారి అభిరుచులను బట్టి ఆయా విషయాలను (Subjects) తీసుకొని మననం చేసి ప్రయోగాలు చేశారు. పరిశోధనలు చేశారు. నూతన ఆవిష్కారాలను చేశారు. వివిధ విజ్ఞాన గ్రంథాలు రచించారు.

మన ఋషులు కనుగొన్న ఆయుర్వేదం అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ ప్రాణులకు మేలు చేస్తుందే కాని కీడు చెయ్యదు. ప్రజలపై తలకు మించిన భారాన్ని పెట్టదు. రోగాన్ని అణచిపెట్టడంకాని, వక్ర ప్రభావాన్ని (side effects) గాని కలిగించదు. వారు అనుసరించిన వ్యవసాయ పద్ధతులు భూసారాన్ని పెంచుతాయేకాని క్షీణింప చెయ్యవు. వాతావరణాన్ని కలుషితం చెయ్యవు. ఆహార పోషకతను పెంచుతాయేకాని బలహీనపరచవు. అట్లే, విమాన వాహన యంత్ర శిల్ప భూగోళ ఖగోళాది విజ్ఞాన శాస్త్రాలు, పద్ధతులు ఎప్పటికీ ప్రాణికోటికీ మేలు చేస్తాయికాని కీడు చెయ్యవు. విద్యారంగంలో - సంగీత సాహిత్య నృత్యనాటక తర్క న్యాయ మీమాంసాది విషయాలలో వారు చేసిన ప్రయోగాలు బుద్ధిని పదును పెడతాయేకాని మొద్దుబార చేయవు. వారి అనుసరణలన్నిటి వెనుక సర్వహిత కామన, భూతదయ, సమగ్ర ఉన్నతి పునాదులుగా ఉన్నాయి. జీవిత లక్ష్యాలైన ధర్మార్థకామమోక్షాల వైపు పయనింప చేసేవిగా ఉన్నాయి.

దురదృష్టవశాత్తు మధ్యకాలంలో మనదేశం విదేశీయుల పాలనలోకి వెళ్లిపోయింది. ప్రాచీన వైభవాన్నంతా కోల్పోయింది. 95 శాతం విజ్ఞాన గ్రంథాలు విదేశీయుల విద్వేషాగ్నిలో కాలి భస్మమైపోయాయి. కేవలం 5 శాతం మాత్రమే మిగిలి ఉన్నాయి. అయినప్పటికీ ఫరవాలేదు. వేదాల వెలుగులో మనం వాటిని పునరుద్ధరించుకోవచ్చు. మన సంస్కృతీ సభ్యతల పట్ల స్వాభిమానం, స్వావలంబనను సాధించాలనే సంకల్పం, దృఢమైన మనస్సు ఉంటే సాధించటానికి ఒక మార్గం

దొరకకపోదు.

ఇక మనం శాంతిని గురించి వేదం ఏమి చెబుతున్నదో తెలుసుకుందాము. ముందుగా మనం తరచుగా కార్యక్రమాల ముగింపులో చదివే శాంతిపాఠ మంత్రాన్ని గురించి కొద్ది వివరంగా తెలుసుకుందాము.

**ఓ3మ్ ద్యౌశాన్తిః+అన్తరిక్షం శాంతిః, పృథివీ శాంతిః**

పై వేదవాక్యంలోని మొదటి పదం 'ఓం'. ఇది మంత్రంలోని భాగం కాదు. వేదపాఠాన్ని ప్రారంభించేటప్పుడు పరమేశ్వరుని ముఖ్యనామమైన ఓం కారాన్ని ఉచ్చరించి ప్రారంభించటం మన సాంప్రదాయం. ఆ వేదపాఠం ఒక వేదమైనా, ఒక సూక్తమైనా, ఒక ప్రకరణమైనా కేవలం 1.2 మంత్రాలైనా ముందుగా ఓంకారాన్ని ఉచ్చరిస్తారు. వేదప్రదాతను, సర్వవ్యాపక సర్వేశ్వరుని స్మరిస్తారు. వేదం ఓం పదంలోని 'ఓ' ను ఫ్లుతంగా పలుకమంటుంది. కనుక 'ఓ3మ్'గా పలుకుతున్నారు. ఓ3మ్ అనే పదంలో చాలా అర్థాలున్నాయి. సంక్షిప్తంగా 'సర్వసంరక్షకు' డని అర్థం. ఇంగ్లీషులో (Guardian) అని అర్థం.

రెండవ పదం ద్యౌః. ద్యౌ అంటే ద్యులోకం. స్వయం ప్రకాశకాలైన సూర్యుడు, నక్షత్రాలు ఉండే స్థానం. విశ్వం చాల విశాలమైనది. అందులో లెక్కించ లేనన్ని లోకాలుంటాయి. అట్టి విశ్వాన్ని వేదం స్థూలంగా మూడు లోకాలుగా విభజించి వ్యవహరిస్తుంది. ఈ భూమిని, దీనిపై నున్న పంచభూతాలను, ప్రాకృతిక శక్తులను, ప్రాణులను, సర్వపదార్థాలను కలిపి భూలోక మంటుంది. సూర్య నక్షత్రాదులుండే లోకాన్ని ద్యులోక మంటుంది. ఈ రెంటికీ మధ్యన ఉన్న ప్రదేశాన్ని అంతరిక్షం అంటుంది. దీనిలో గాలి, గ్రహాలు, ఉపగ్రహాలు, ఉల్కలు మొదలనైవన్నీ ఉంటాయి. ఈ మూడు లోకాలు శాంతిగానే ఉన్నాయని పై వేదవాక్యం చెబుతున్నది. కనుక మనం మూడు లోకాలలో శాంతి ఎలానెలకొనివుందో పరిశీలిద్దాము.

ఈ మూడు లోకాలలోనూ ద్యులోకమే అత్యంత విశాలమైనది. ఎంత పెద్దదంటే – "అత్యాధునిక టెలిస్కోపులకు, కంప్యూటర్లకు కూడా విశ్వపరిధి (చివరి భాగం) తెలియటం లేదు. మన సూర్యుడు మిల్కీవే గెలాక్సీలో ఒక చిన్న నక్షత్రం. ఒక్కొక్క గెలాక్సీలో 500 బిలియన్ల కన్న ఎక్కువగానే నక్షత్రాలుంటాయి. అవన్నీ సూర్యులే. వాటి చుట్టూ గ్రహాలు, ఉపగ్రహాలు ఉంటాయి. విశ్వంలో ఇటువంటి

గెలాక్సీలు (పాలపుంతలు) 10 వేల కోట్లకంటే ఎక్కువగానే ఉంటాయి. ఇప్పటి కంప్యూటర్ల ద్వార ఎస్టిమేషన్ వేస్తే చివరి గెలాక్సీ నుండి వచ్చే కాంతి కిరణం మన భూమికి చేరటానికి 13,000 కాంతి సంవత్సరాలు (light years) పడుతున్నది" అని ఖగోళ విజ్ఞానవేత్త లంటున్నారు. కాంతి ఒక సెకనుకు 1,86,000 మైళ్ళ వేగంతో పయనిస్తుంది. విస్తరిస్తుంది. ద్యులోకం ఎంత పెద్దదో మీరే ఊహించుకోండి. కనుకనే మన వేదాలు "భూమ్నా ద్యౌః" చాలా విశాలమైనది ద్యులోకం అన్నాయి.

ఇంతేగాక, ద్యులోకం ఉగ్రమైనదంటుంది వేదం. నక్షత్రాలన్నీ సూర్యులే కనుక వాటిపైనా పెద్దపెద్ద జ్వాలలు, మైళ్ళ ఎత్తు ఎగిసిపడే మంటలుంటాయి. కనుక ద్యులోకం ఉగ్రమైనదే. అయినప్పటికీ అది మనకు ఏ కీడూ చెయ్యదు. వాటినన్నిటినీ పరమేశ్వరుడు వాటివాటి స్థానాల్లోనే ఉండేటట్టు దృఢంగా పట్టుకుని ఉన్నాడు. ఈ క్రింది మంత్రాన్ని గమనించండి.

**ఓం యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృఢా యేన స్వః స్తభితం యేన నాకః।**
**యో అంతరిక్షే రజసో విమానః కస్మై దేవాయ హవిషా విధేమ ॥**

– యజుర్వేదం (32-6)

తా॥ ఎవనిచే ఉగ్రమైన ద్యులోకము మరియు పృథివి దృఢముగా వాటి వాటి స్థానాలలో ఉంచబడినవో, ఎవనిచే సుఖము, మోక్షానందములు ధరింపబడి ఉన్నవో, ఎవరు అంతరిక్షంలో (భూమికి సూర్యునికి ఉన్న మధ్య భాగంలో) గ్రహాలను విమానాలవలె త్రిప్పుచున్నాడో అట్టి సుఖ స్వరూపుడైన ఏకేశ్వరునకు మా వందనములు.

ఇది ఒక ప్రార్థనా మంత్రం. ఇట్టి మంత్రాలు వేదాలలో కోకొల్లలు. వేదంలోని ప్రార్థనా మంత్రాలన్నీ దాదాపుగా ఈ విధంగానే ఉంటాయి. పోతనామాత్యులవారు భాగవతం ప్రారంభించే ముందు చెప్పిన ఈ క్రింది పద్యం వలె ఉంటాయి.

**"ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు**
**లీనమై ఎవ్వని యందు డిందు,**
**పరమేశ్వరు డెవ్వడు మూలకారణం బెవ్వడు వానిన్**
**ఆత్మభవున్ ఈశ్వరునే శరణంబు వేడెదన్ "** అనే భావాన్ని కలిగి ఉంటాయి.

ప్రార్థన ఈ విధంగానే చెయ్యాలంటాడు పరమేశ్వరుడు.

ద్యులోకం ఎంత విశాలమైనదైనా, ఎంత ఉగ్రమైనదైనా పరమేశ్వరుని నియమాలకు కట్టుబడి శాంతంగానే ఉంది. అట్లే అంతరిక్షం కూడా అంతరిక్షంలోని మంగళ బుధ గురు శుక్ర శని గ్రహాలు, మన భూమి, క్రొత్తగా గుర్తించిన గ్రహాలు (యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో) ఈ గ్రహాల చుట్టూ తిరిగే ఉపగ్రహాలు (చందమామలు) అన్నీ శాంతంగానే ఉన్నాయి. ఎవరికీ ఏమీ అశాంతినిగానీ, కష్టాలనుగానీ, నష్టాలనుగానీ కలిగించటం లేదు. కొందరు ధూర్తులు ఫలిత జ్యోతిష్యాలు వ్రాసి ప్రజలకు భయభ్రాంతులను కలిగిస్తున్నారు. ఏవో కొన్ని గ్రహాలు మీపట్ల ఆగ్రహంగా ఉన్నాయని చెప్పి, వాటికి శాంతులు చెయ్యాలనీ, యంత్రాలు కట్టుకోవాలనీ అంటూ మోసపు మాటలు చెప్పి అమాయకులనుండి దక్షిణలు (రుసుములు, ఫీజులు) దోచుకుంటున్నారు. వీటిని మేధావులంతా ఖండించాలి.

ఈశ్వరీయ జ్ఞానమైన నాలుగు వేదాలలోనూ ఏ గ్రహమూ, ఏ నక్షత్రమూ మంచిది కాదనీ, శాంతులు చెయ్యాలనీ చెప్పబడలేదు. ఇంతేగాక, అవన్నీ మంచివనీ, మంగళకరమైనవే నని అథర్వ వేదం లోని నక్షత్ర సూక్తం (19 కాండం, 7వ సూక్తం) స్పష్టంగా చెబుతున్నది. వేదభగవానుని మాటలు మనకు ప్రమాణములా? లేక కొద్దిగా సంస్కృతం నేర్చుకున్నవారి మాటలు ప్రమాణములా? ఆలోచించండి. సందర్భం వచ్చింది కనుక గ్రహనక్షత్రాల గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాం.

**గ్రహనక్షత్రాల సమీక్ష (Planets and Stars) :**

నేడు లోకంలో నవగ్రహాల పేరుతో జరిగే పూజావిధానం, అందులో చదివే మంత్రాలు, గ్రహాల పుట్టు పూర్వోత్తరాలను గురించి కల్పించి వ్రాసిన ఫలిత జ్యోతిష గ్రంథాలు ఏవీ సరిగా లేవు. హేతుబద్ధంగా అసలే లేవు. వారు నవగ్రహాలలో సూర్యుని చేర్చారు. కాని, సూర్యుడు గ్రహం కాదు. అది ఒక నక్షత్రం - స్వయం ప్రకాశకం. అట్టి దానిని గ్రహం అనకూడదు. రాహుకేతువులు కేవలం సూర్యచంద్రులపై ఏర్పడిన నీడలు మాత్రమే. వాటిని అసలు గ్రహాలే అనకూడదు. ఇక చంద్రుని గురించి - చంద్రుడు మన భూగ్రహం చుట్టూ తిరిగే ఒక ఉపగ్రహం. ఇట్టి ఉపగ్రహాలు వేరే గ్రహాలకూ ఉంటాయి. వైజ్ఞానికులు లెక్కగట్టి ఈ సూర్య కుటుంబంలో 32 ఉపగ్రహాలున్నాయంటున్నారు. అవన్నీ కలుపుకుంటే గ్రహాల సంఖ్య

చాలా పెరిగిపోతుంది కదా! మన భూమి కూడా ఒక గ్రహమే. మరి దానిని నవగ్రహాలలో ఎందుకు చేర్చలేదు?

ఫలిత జ్యోతిష్కులు చెప్పే నవగ్రహాలు :

1)సూర్యుడు 2)చంద్రుడు 3)మంగళుడు 4)బుధుడు 5)గురుడు 6)శుక్రుడు 7)శని 8)రాహువు 9)కేతువు. వీటికి వేరువేరు రంగు లుంటాయనీ, అధిదేవతలు ప్రత్యాధి దేవతలు కూడా ఉంటాయనీ అంటారు. ఇవి పరస్పరం కొన్ని మిత్రులు, కొన్ని శత్రువులు అంటారు. ఇంకా ఏవేవో మాటలు చెబుతారు.

నవగ్రహాల నాహ్వానిస్తూ చదివే కొన్ని మంత్రాలలో అసలు ఆ గ్రహాల పేర్లే లేవు. చూడండి-

1) బుధగ్రహాన్ని 'ఉద్బుధ్యస్వాగ్నే ....'' అనే మంత్రంతో ఆహ్వానిస్తారు. కాని, ఈ మంత్రంలో బుధ పదమే లేదు. ఉద్బుధ్యస్వ + అగ్నే = ఉద్బుధ్యస్వాగ్నే అయ్యింది. దీనిలో రెండు పదములున్నాయి. ఉద్బుధ్యస్వ ఒకటే పదము. దీనికి 'మొలకెత్తి వికసించు' అని అర్థం. అగ్నిహోత్రంలో అగ్నిస్థాపన చేస్తూ బీజంగా ఒక అగ్ని కణాన్ని ఉంచుతారు. ఆ అగ్న్యాధాన అమంత్రంలో "ఓ అగ్నీ ! నీవు విత్తనంవలె మొలకెత్తి, చెట్టువలె వికసించు పెద్ద జ్వాలగా వర్ధిల్లు" అనే అర్థం ఉంది.

2) శనిగ్రహాన్ని "శన్నోదేవీ రభిష్టయ ....." అనే మంత్రంతో ఆహ్వానిస్తారు. ఇది విడదీస్తే "శమ్+నః+దేవీ+అభిష్టయ" అవుతుంది. 'శని' పదం ఎక్కడ ఉంది?

బుధుడు మగధదేశంలో పుట్టాడట. శని సౌరాష్ట్రంలో పుట్టాడట. సూర్యుడు కళింగ దేశంలో, చంద్రుడు యమున దేశంలో పుట్టారట. ఈ విధంగా అవి పుట్టిన దేశము, గోత్రము, పుట్టిన సంవత్సరము తిథి వార నక్షత్రాలు కూడా వ్రాశారు. సూర్యుని జననం మాఘ శుద్ధ సప్తమి అట. సూర్యుని తరువాతనే కదా కాలగణన ప్రారంభమౌతుంది. ఇట్టి మాటలు ఎవరైనా వింటే నవ్విపోతారు. వీటి వివరాలు తెలుసుకోగోరువారు పం. వ్రతపాల్ గారు వ్రాసి ప్రచురించిన 'వైదిక సృష్టి విజ్ఞాన్' చదువండి.

ఇప్పుడు ఫలిత జ్యోతిష్కులు చెప్పే నవగ్రహాల పేర్లు వేదాలలోనూ ఉన్నాయి కాని, అవి భౌతిక గ్రహాలను గురించి కాదు. వాటికి ఆయా ప్రకరణాలలో వేరువేరు

అర్థాలుంటాయి. విచిత్రంగా ఈ పేర్లలన్నీ మూలార్థాన్ని బట్టి సర్వవ్యాపక సర్వేశ్వరునికిన్నీ వర్తిస్తాయి. తెలుసుకోగోరువారు మహర్షి దయానందులవారు రచించిన "సత్యార్థ ప్రకాశం" లోని మొదటి సముల్లాసం చదువండి. నవగ్రహ పూజావిధానంలోని లోపాలు వివరంగా తెలుసుకోవటానికి పం. అన్నె కేశవార్య శాస్త్రి గారి "నవగ్రహారాధన సమీక్ష" పుస్తకం చదువండి. ఇది శ్రీ కోటికె లక్ష్మయ్య గారి విద్యాబుక్ డిపోలో దొరుకుతుంది. (వారి సెల్ నం. 92912 24722).

ఇక నక్షత్రాల గురించి సంక్షిప్తంగా :- మబ్బులు లేని ఒక చీకటి రాత్రి మనం ఆకాశాన్ని పరిశీలించినట్లైతే లెక్కలేనన్ని నక్షత్రాలు కనబడతాయి. మనం చూస్తున్నవి సగభాగం మాత్రమే. మరొక సగభాగం భూమికి వెనుక (మనకు క్రిందివైపు) ఉంటాయి. బలమైన దూరదర్శినితో చూస్తే నక్షత్రాలు మరెన్నో (3,4 రెట్లు ఎక్కువ సంఖ్యలోనే) కనబడతాయట. మరి నక్షత్రాలు 27 మాత్రామే కదా! అది ఎందుచేతనంటే - భూమి చుట్టూ కనబడే నక్షత్రాలను ఋషులు ఒక వలయంగా భావించి దానిని భావవృత్తమనీ, కాంతి వృత్తమనీ అన్నారు. అందులో మనం ఎప్పుడూ సగం వృత్తాన్ని మాత్రమే - 180 డిగ్రీల భాగాన్ని మాత్రమే చూస్తువుంటాము. అట్టి కాంతివృత్తాన్ని ఖగోళవేత్తలు 27 భాగాలుగా చేసి, ఒక్కొక్క భాగానికి ఒక్కొక్క నక్షత్రమని వేరు వేరు పేర్లు పెట్టారు. అంటే, కాంతి వృత్తంలోని 360/27 వ భాగం ఒక నక్షత్ర భాగమన్నమాట. అట్టి ఒక్క భాగంలో కూడా వేలకొలది నక్షత్రాలుంటాయి. కాని మనకు ఎక్కువ ప్రకాశంగల కొన్ని నక్షత్రాలు మాత్రమే సామాన్యకంటికి కనబడతాయి. ఉదాహరణకు అశ్వని నక్షత్రాంలో ఎక్కువ ప్రకాశంగల రెండు తారలు ఉంటాయి. కనుక ద్వివచనంలో దీనిని 'అశ్వయుజౌ' అంటుంది వేదం. వాటి క్రింద మరొక చిన్నతార అస్పష్టంగా కనబడతుంది. బాగా పరీక్షగా చూస్తే అది గుఱ్ఱం తలవలె ఉంటుందట. అందుకే ఆ నక్షత్ర భాగాన్ని 'అశ్వనీ' అన్నారు. ఈ విధంగానే మిగతా నక్షత్రాలకు కూడా వేదం పేర్లు పెట్టింది.

**ఇక రాశుల గురించి సంక్షిప్తంగా-**

పైన చెప్పుకున్న కాంతి వృత్తాన్నే ఋషులు 12 భాగాలు చేసి వాటికి 'రాశులు' అని వేరు వేరుగా 12 పేర్లు పెట్టారు. అంటే అప్పుడు ఒక్కొక్క రాశిలో రెండుంబావు ( $2\frac{1}{4}$ ) నక్షత్రాలు ఉంటాయన్నమాట. వీటికి కూడా ప్రకాశతారల ఆకారాన్ని బట్టే

ఆ యా పేర్లు పెట్టారు. పనిలో పనిగా ఇక తిథి వార నక్షత్ర యోగ కరణాల గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాము.

మనం అనుసరించేది చాంద్రమాణం. అంటే చంద్రుడు అనుసరించే మార్గాన్ని బట్టి కాలగణన చేస్తూ ఉంటాము. శుక్లపాడ్యమి నుండి అమావాస్య వరకు ఒక నెలగా పరిగణిస్తాము. ఈ చాంద్రమాన నెలలో 29 రోజులు మాత్రామే ఉంటాయి. భూమి సూర్యుని చుట్టూ ఒకసారి తిరిగి రావటానికి 365 రోజులు పడుతుంది కదా! అందుచేత చాంద్రమానం లో సంవత్సరానికి 12 రోజులు తక్కువ ఉంటుంది. ఈ వ్యత్యాసాన్ని పూరించటానికని $2\frac{1}{2}$ సంవత్సరాలకు ఒకసారి ఒక నెలను అధికమాసంగా చేస్తూ ఉంటారు. చాంద్రమానంలో శుక్ల పాడ్యమి నుండి లెక్కపెడుతూ 15వ దినాన్ని పౌర్ణమి అంటారు. ఆ తరువాత కృష్ణ పక్షం ప్రారంభమౌతుంది. 15వ దినమున అమవాస్య వస్తుంది. ఈ రోజుల గణననే 'తిథి' అంటారు.

వారాలు మనం అనుసరించే క్రమంలోనే 7 రోజులుగా ఉంటాయి. నక్షత్ర గణన పూర్వం చెప్పుకొన్నట్లుగా చంద్రుడు ఏ నక్షత్ర భాగంలో ఉంటే ఆ దిననక్షత్రం అది ఔతుంది. ఉదా: చంద్రుడు అశ్వనీ నక్షత్ర భాగంలోఉన్నరోజున అశ్వనీ నక్షత్రమన్నమాట. యోగ, కరణాలు సామాన్య పంచాంగాల్లో ఉండవు కాని, రాష్ట్రీయ పంచాంగంలో ఉంటాయి. యోగములు మొత్తం 27, కరణములు 7. వీనిలో 7 వ దైన విష్టికరణం 4 భాగాలుగా ఉంటుంది. ఇవికూడా రోజు రోజుకు తిథి వార నక్షత్రాల మాదిరిగా మారుతూవుంటాయి. ఇవి అంత ముఖ్యమైనవి కావుకనుక మన పురోహితులు రాష్ట్రీయ పంచాంగం చూడ బద్ధకించి 'శుభయోగే, శుభకరణే' అని అంటూవుంటారు. ఈ విధంగా భారతీయ పంచాంగం 5 అంగములుగా – తిథి వార నక్షత్ర యోగ కరణములుగా ఉంటుంది.

ఇదీ సంక్షిప్తంగా గ్రహనక్షత్రాల సమీక్ష. ఇవన్నీ మంచివే. ప్రాణుల కవసరమే. ఇవన్నీ పెద్ద పెద్ద బండరాళ్లవంటి జడపదార్థాలే–జ్ఞానం లేనివే. వీటికి ఒకరిపై ఆగ్రహంకాని, మరొకరిపై అనుగ్రహంకాని ఉండవు. వీటన్నిటినీ సృజించినది, ధరించినది, నియమంగా నడుపుతున్నది సర్వవ్యాపక సర్వేశ్వరుడే. అట్టి సృష్టికర్తే వేదం ద్వారా అభయమిస్తున్నాడు. "ఓ మానవులారా! ద్యౌశాంతిః

అంతరిక్షం శాంతిః పృథివీ శాంతిః - ద్యు అంతరిక్ష భూలోకాలు శాంతంగానే ఉన్నాయి. ఏవేవో ఊహించుకొని భయపడకండి. అనవసరంగా మనస్సును అశాంతికి గురి చేసుకోకండి" అంటున్నాడు. "సా మా శాంతిరేధి" త్రిలోకాలలో నెలకొనివున్న ఆ శాంతి నాలో ప్రవేశించాలని తరచు సంకల్పించుకోండి" అంటున్నాడు. తస్మాత్ అభయం!

**ఆపః శాంతిః, ఓషధయః శాంతిః, వనస్పతయః శాంతిః**

ఇక భూమి పై నున్న వాటిని గురించి ఆలోచిద్దాము

అపః శాంతిః జలం శాంతిగా ఉంది. సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుని సృష్టిలో జలం (నీరు) ఒక అద్భుతమైన పదార్థం. సామాన్య కంటికి కనబడని హైడ్రోజన్, ఆక్సిజన్ అను రెండు వాయువులను కలిపి కనబడే నీటిగా సృజించాడు దేవుడు. ఈ వాయువుల నిష్పత్తి $H_2O$ గా ఉంటుందంటారు వైజ్ఞానికులు. అంటే - 2 హైడ్రోజన్ అణువులు, ఒక ఆక్సిజన్ అణువు కలిసి నీటి అణువు ఏర్పడిందన్నమాట. ఈ రెండు వాయువులు అగ్నికి దోహదం చేసి మంటలను మరింత పెంచుతాయి. అయినప్పటికీ అవి రెండు కలిసి ఏర్పడిన జలం మంటలను ఆర్పుతుంది. అగ్నిని పూర్తిగా నశింపజేసి మట్టిలో కలుపుతుంది.

ఇంతేగాక, నీరు లేకుండా ఏ ప్రాణీ జీవించలేదు. ప్రాణుల శరీరాలలో మిగతా పదార్థాలకన్న నీటి శాతమే అధికంగా ఉంటుంది. ఈ భూమిపై భూతలంకన్న నీటితలమే (సముద్ర తలమే) ఎక్కువ. అందువల్లనే సూర్య తాపానికి నీరు నెమ్మది నెమ్మదిగా ఆవిరై నీటియావిరిగా (తేమగా) గాలిలో చేరుతుంది. క్రమంగా అది మేఘాలుగా ఏర్పడుతుంది. ఋతుపవనాల ద్వారా ఆ మేఘాలు భూమిపైభాగానికి చేరుకొని చల్ల గాలులు తగిలి వర్షిస్తాయి. వర్షం నీరు క్రమంగా మరల సముద్రాన్ని చేరుతుంది. ఈ విధంగా నీరు చక్రభ్రమణం చేస్తుందే కాని నశించదు. ఆధునిక వైజ్ఞానికులు లెక్కలు కట్టి భూమిపై $126 \times 10^{19}$ లీటర్ల నీరు ఉన్నదంటున్నారు. అంటే 126 తరువాత 19 సున్నాలు చుడితే ఎంత సంఖ్య వస్తుందో అన్ని లీటర్ల నీరు భూ అంతరిక్షాలలో ఉంటుంది. ఈ సంఖ్య పెరగటంకాని, తరగటంకాని ఉండదట. రూపాంతరం చెందుతుందేకాని నశించదట.

నీటివల్ల కలిగే ప్రయోజనాలు అనేకం. ఇది చాలా పదార్థాలను తనలో కరిగించుకొని కలుపుకోగలదు. 'The best dissolvent'. అందుచే మన నిత్యావసరాలైన పరిశుభ్రతకు, ఆహారం పచనం కావటానికి, పచనమైన (జీర్ణమైన) ఆహారం శరీరంలోని అన్ని భాగాలకు అన్ని కణాలకు చేరటానికి, మరల కణాలవద్ద ఏర్పడిన మలినాలను తనలో కరిగించుకొని మూత్రపిండాల ద్వారా బయటకు పంపటానికి మరెన్నో ప్రయోజనాలకు నీరే మాధ్యమంగా ఉంటుంది. భూమిలోని లవణాలను తనలో కరిగించుకొని వృక్ష జాతులకు అందజేసేది కూడా నీరే.

ఇది తేలికగా ఘన ద్రవ వాయు రూపాలుగా మారి మరెన్నో ప్రయోజనాలను కలిగిస్తుంది. నీరు సున్న (0) డిగ్రీల ఉష్ణోగ్రత దగ్గర ఘనరూపం చెందుతుంది. అది ఘనీభవించినప్పుడు పరిమాణంలో పెద్దదై నీటిలో తేలియాడుతుంది. ఈ స్థితికూడా సృష్టికి అవసరమే. శీతకాలంలో హిమాలయాలవంటి ఎత్తైన పర్వతాలపై మంచుగా కురిసి గట్టిపడి అక్కడ నిలువ ఉంటుంది. మరల వేసవి వచ్చినప్పుడు కరిగి నీరుగా మారి భూమిపైకి ప్రవహిస్తుంది. శీతకాలంలో ధ్రువప్రాంతాల వద్ద ఉండే సముద్రాలు గడ్డకట్టి గట్టిపడతాయి. అయితే సముద్రమంతా గట్టిపడిపోదు. అలాగే జరిగితే సముద్ర చరాలన్నీ చచ్చిపోతాయి కదా! మరల అది కరగాలంటే చాలా ఉష్ణం కావాలి కదా! అందుకని పరమేశ్వరుడు గట్టిపడిన నీటిని (మంచును) నీటిపై తేలియాడేటట్టు సృజించాడు. అక్కడి సముద్రాలపై మంచుని ఒక పొరగా ఏర్పరచి క్రిందినీరు గడ్డ కట్టకుండా చేస్తున్నాడు. అందుచే అక్కడి జలచరాలు మంచుపొర క్రింది నీటిలో పెద్ద ఇబ్బంది లేకుండా జీవిస్తాయి. ఇంతేగాక, గడ్డకట్టిన పొరపై అక్కడక్కడ బోరింగు రంధ్రాలవలె ఏర్పడి గాలి పోవటానికి అవకాశమిస్తాయట. ఆ గాలి (ఆక్సిజన్) ఆ ప్రాణులకు అవసరమనియట. ఇవన్నీ వింటుంటే సృష్టికర్త ఎంత దయామయుడో అనిపిస్తుంది కదా!

ఇవన్నీ పరిశీలించిన స్టాన్‌ఫోర్డ్ పరిశోధనా సంస్థలోని రసాయన విభాగానికి (Chemistry Department) అధ్యక్షులుగా పనిచేసిన డా. థామస్ డేవిడ్ పార్క్స్ గారు ఏమన్నారంటే – "ప్రకృతిలోని పదార్థాలన్నీ సహజంగా వాటంతట యవిగా ఏర్పడినవి కావు. సృష్టిలోని క్రమబద్ధత, నియమబద్ధత. సర్వోన్నత బుద్ధిమంతుని శాసనం వల్లనే కలిగింది. వీటి నిర్మాణం సర్వోచ్ఛ కుశల రచయిత చేతనే చేయబడింది.

ఆ బుద్ధిమత తత్త్వాన్నే నేను దేవుడు అంటున్నాను. ప్రాణుల హితం కొరకే యింతటి చమత్కార పూర్వక సృష్టిని చేశాడు. అతడు మహామేధావి, మహత్తర శక్తి సంపన్నుడు. అతడు మహాదయానిధి. అట్టి దివ్యగుణయుక్తుడైన దేవుడు నాకు వేరే పదార్థాలలో కన్నా నీటిలోనే స్పష్టంగా కనబడుతున్నా" దన్నారు.

అట్టి సృష్టికర్త యిచ్చినదే వేదం. వేదాలలో జలవిశిష్టతను తెలిపే మంత్రాలు చాలానే ఉన్నాయి. నీరు గొప్ప ఔషధమని కూడా కీర్తించాయి.

**అప్సుమే సోమో అబ్రవీత్ అంతర్విశ్వని భేషజా ।**
**అగ్నిం చ విశ్వ శంభువమ్ ॥** - ఋగ్వేదం (1-23-20)

ఇట్టి మంత్రాలు నాలుగు వేదాలలోనూ ఉన్నాయి. తెలుసుకోగోరు వారు నా రచన "వేదాలలో జలచికిత్సా విజ్ఞానం" చదువగోరుచున్నాను.

వేదాలపై పరిశోధనలను చేసిన మన మహర్షులు ఏమన్నారంటే-

**ఆపః శివాః శివతమాః, శాన్తాః శాన్తతమాః,**
**తాస్తే కృణ్వన్తు భేషజమ్ ॥**

- పారశ్కర గృహ్యసూత్రాలు (2-8-6)

జలం కళ్యాణకరమైనది-మేలుచేసేది. కళ్యాణముచేయువానిలో అదే ఉత్తమమైనది. అది శాంతి నిస్తుంది కూడా. శాంతి నిచ్చువానిలోనూ అదే ఉత్తమమైనది. అట్టి జలం మీకు గొప్ప ఔషధంగా పనిచేస్తుంది. సద్వినియోగం చేసుకోండన్నారు.

కనుక, జలం ఎప్పుడూ శాంతంగానే ఉంటుంది.

<u>ఓషధయః శాంతిః, వనస్పతయః శాంతిః :-</u>

సామాన్యంగా ఓషధులంటే మందుమొక్కలనీ, వనస్పతులంటే అడవులలో ఉండే పెద్దపెద్ద వృక్షాలనీ అనుకుంటారు. కాని, మన ప్రాచీన శాస్త్రాలలో ఒక పంటయిచ్చి ఎండిపోయే వాటిని ఓషధులనీ, పుష్పించకుండానే ఫలాలనిచ్చే వాటిని వనస్పతులనీ చెప్పబడింది. అంటే - వరి, గోధుమ, కందులు, పెసలు, నువ్వులుమొదలైన వాటిని ఓషధులనీ; మఱ్ఱి, రావి, అత్తి మొదలైన వాటిని వనస్పతులనీ అంటాయి శాస్త్రాలు. మామిడి, కొబ్బరి, జామ, సపోటా, ఉసిరి మొదలైనవి కూడా

ఎక్కువ పర్యాయాలు పంటలనిస్తాయి కనుక వీటినికూడా వనస్పతు లనవచ్చు. ఇవన్నీ ఆకలి బాధను నివారిస్తూ మనకు బలాన్నీ, పుష్టినీ యిస్తూ కాపాడుతాయి. కనుక అవి శాంతంగానే ఉన్నాయి. శాంతినే ఇస్తున్నాయి అంటున్నది పై వేదవాక్యం.

<u>విశ్వదేవాః శాన్తిః :-</u> సమస్త దివ్యగుణయుక్త పదార్థాలు (దేవతులు) శాంతంగానే ఉన్నాయి. దేవత అంటే ఇతరులకు మేలు చేసేది అని అర్థం. అది ఒక ప్రాకృతిక (జడ) పదార్థం కావచ్చు, లేదా దివ్యగుణాలుగల వ్యక్తి కావచ్చు. ఇక్కడ ఈ మంత్రంలో సృష్టిలోని దివ్యపదార్థాలని గ్రహించాలి.

బ్రహ్మ శాన్తిః :- బ్రహ్మ అంటే పెద్దది. గొప్పది అని అర్థం. సమస్త విశ్వాన్ని తనలో ఏకపాదంగా (1/4గా) కలిగి ఉన్న అతి పెద్దవాడు కనుకనూ, పరిమాణంలో, జ్ఞానంలో, శక్తిలో అన్నిటికన్ననూ గొప్పవాడు కనుకనూ సృష్టికర్తను బ్రహ్మ అంటాయి వేదాలు. ఇక లోకంలో (వ్యక్తులలో) నాలుగు వేదాలు చదువుకొని జ్ఞానంలో గొప్పవాడైన వ్యక్తినికూడా బ్రహ్మ అంటారు. అట్లే, జ్ఞానపరంగా చూస్తే వివిధశాస్త్రాలలో అన్నిటికన్న గొప్పజ్ఞానం కలది కనుక వేదాలను బ్రహ్మగా పేర్కొనటం వేదశాస్త్రాలలో కనబడుతుంది. ఇచట బ్రహ్మ అంటే వేదాలు అని గ్రహించాలి. ఈ మంత్రం మనకు 4 వేదాలూ శాంతినే బోధిస్తున్నా యంటున్నది.

సర్వం శాన్తిః :- అవి యివి అననేల పరమేశ్వరుని సృష్టిలోనివన్నీ శాంతంగానే ఉన్నాయి.

<u>శాంతిరేవ శాంతిః :-</u> అన్నిటిలోనూ శాంతియే శాంతి నెలకొని ఉంది.

<u>సా మా శాంతి రేధి:-</u> ఆ శాంతి నాలో ప్రవేశించి వర్ధిల్లునుగాక !

ఇదీ సంక్షిప్తంగా శాంతి పాఠం యొక్క వివరణ. ఇక మనం లోకంలో ప్రజలకు కలుగుచున్న కష్టాలకు, నష్టాలకు, భయాలకు, ఆందోళనలకు, అవమానాలకు, అశాంతులకు కారణాలేమిటో సంక్షిప్తంగా తెలుసుకుందాము.

<u>అశాంతికి కారణాలు - పరిష్కారాలు :-</u>

అశాంతులకు, ఆందోళనలకు, దుఃఖాలకు కారణాలనేకం. వాటిని మన మహర్షులు 3 వర్గాలుగా (Groups గా) విభజించి వివరించారు. వాటికి ఆధ్యాత్మిక దుఃఖాలు, ఆధిభౌతిక దుఃఖాలు, ఆధిదైవిక దుఃఖాలు అని పేర్లు పెట్టారు. ఈ త్రివిధ దుఃఖాలనుండి పూర్తిగా విముక్తిని పొందుటకు ప్రయత్నించటమే పరమ

పురుషార్థ మన్నారు. "త్రివిధ దుఃఖ అత్యంత నివృత్తి రత్యంత పురుషార్థః" అంటారు సాంఖ్యదర్శనకర్త కపిలమహర్షి (1-1) లో.

1. <u>ఆధ్యాత్మిక దుఃఖాలు</u>:- జీవాత్మలమైన మనకు శరీరంద్వారా, మనస్సు ద్వారా కలిగే దుఃఖాలను రెంటిని కలిపి ఆధ్యాత్మిక దుఃఖాలన్నారు. శరీరంద్వారా మనకు అప్పుడప్పుడు కొన్ని రోగాలు, బాధలు కలుగుతుంటాయి. మన శరీరం గురించి, ఆరోగ్యనియమాలను గురించి మనకు తెలిసివుంటే చిన్న చిన్న రోగాలను, బాధలును అసలు రాకుండానే చేసుకోవచ్చు. ఈ విషయంలో మన ఆయుర్వేద శాస్త్రాలు చాలా ఉపయోగపడతాయి. ఆయుర్వేద గ్రంథాలలో మనకు ముందుగా కనపడేది స్వస్థవృత్తం. అంటే - స్వస్థంగా - ఆరోగ్యంగా ఉండాలంటే అనుసరించవలసిన వృత్తం = ఆచరించవలసిన దినచర్య, ఋతు చర్య. ఋతుచర్య అంటే - ఆయా ఋతువులలో - వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిర ఋతువులలో (కాలాలో) తీసుకోవలసిన జాగ్రత్తలు, ఆహార విహారాలు అని అర్థం. ఆయుర్వేదంలోని ఈ స్వస్థవృత్తం వైద్యులేగాక మానవమాత్రులందరూ చదువ తగినది, ఆచరించ తగినది.

దీర్ఘరోగాలకు, మొండి రోగాలకు కారణాలు చాలానే ఉంటాయి. వ్యసనాలు, జిహ్వాచాపల్యం, అతిమైథునం ఈ జన్మలోని కారణాలుకాగా పూర్వజన్మలో చేసిన పాపాలు మరొక కారణంగా ఉంటాయి. ఈ జన్మలో చేసినవాటికి మనను మనం అదుపులో పెట్టుకోక తప్పదు. ఇక పూర్వజన్మకృత పాపాలు అనుభవిస్తేకాని పోవు. ఆయుర్వేదాన్ని అనుసరిస్తే వాటినుండి కూడా చాలా ఉపశమనం పొందవచ్చు. అందుకొరకే దేశీయ ఆయుర్వేద, ప్రకృతి, యునానీ, యోగాసన ప్రాణాయామాది చికిత్సా పద్ధతులు ఆవిర్భవించాయి. విదేశాలలో ఆవిర్భవించినప్పటకీ హెూమియోపతి వైద్యం ఆయుర్వేద శాస్త్రాలనే అనుసరిస్తుంది. విదేశీ ఆంగ్లవైద్యమే (అల్లోపతియే) రోగాలను అణచి పెడుతూ క్రొత్త క్రొత్త రోగాలను పుట్టిస్తున్నది. మందులతో సాధ్యం కానప్పుడు శస్త్రచికిత్సను ఆశ్రయించాలని అన్ని వైద్యశాస్త్రాలు చెబుతాయి. శస్త్ర చికిత్స ఏ వైద్యానికి స్వంతంకాదు.

ఆధ్యాత్మిక దుఃఖాలలో రెండవ భాగం మానసిక దుఃఖాలు. మానసిక

దుఃఖాలకు. అశాంతికి ముఖ్యకారణం అజ్ఞానం. దేహాత్మ భ్రాంతి. జీవులమైన మనం మన అసలు స్వరూపాన్ని మరచి దేహమే "మనం" అనుకొని అహంకార అభిమాన మమకారాలకు గురికావటం. మానసిక అశాంతి నుండి నివృత్తి చెందడానికి ఎవరెన్ని ఉపాయాలు చెప్పినా, పూజలు వ్రతాలు, గ్రహశాంతులు, మంత్రాలు, యంత్రాలు చేసినా చివరకు మన ఆధ్యాత్మిక గ్రాంథాలను అనుసరించక తప్పదు. ముఖ్యంగా జీవాత్మ స్వరూప స్వభావాలను గురించి శ్రవణ మనన నిధిధ్యాసనలు చెయ్యాలి. ఆత్మజ్ఞానాన్ని బలపరచుకోవాలి. ధర్మాధర్మలను కర్తవ్యాకర్తవ్యాలను తెలుసుకోవటానికి వేదాలను, స్మృతులను, నీతిశాస్త్రాలను చదువుతూ వాటిని అనుసరించాలి.

అపహాసం జరిగినా, నమ్మకద్రోహం జరిగినా మనస్సు ఎక్కువగా బాధపడుతుంది. చాలాకాలం ఆ స్మృతులు వెంటాడుతూ ఉంటాయి. అటువంటి సమయాలలో మనస్సును మరొక విషయం వైపు మాటిమాటిక మరలిస్తూ ఉండాలి. సర్వేశ్వరుడు న్యాయకారి అని నమ్మి మనకు ఆలస్యంగానైనా న్యాయం జరుగుతుందని సమాధానపరచుకోవాలి. ఏమైనా నష్టాలు కష్టాలు కలిగితే ప్రారబ్దబలంవల్ల కలుగుతున్నవని భావించి వాటినుండి బయటపడటానికి ప్రయత్నం చేస్తూనేవుండాలి. ప్రారబ్దఫలాలు ఎలా వస్తున్నాయో అలాగే మన పురుషార్థానికీ ఫలాలు ఉంటాయి. ఆలస్యంగానైనా అవి తప్పక ఫలిస్తాయి.

కొందరు అకారణంగా దిగులుకు, భయాలకు గురియౌతారు. భవిష్యత్తును గురించీ, అయినవారిని గురించీ, మరణాన్ని గురించీ ఏవేవో ఊహిస్తూ అశాంతిని కొనితెచ్చుకుంటారు. ఇటువంటి వాటికినీ ఆత్మజ్ఞానమే ఉత్తమ పరిష్కారం. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాల వల్లనూ అశాంతి కలుగుతుంది. వాటిని శత్రువులుగా భావించి వాటిని జయించ ప్రయత్నించాలేకాని తృప్తిపరచ ప్రయత్నించకూడదు. అలా చేస్తే అవి యింకా పెరుగుతాయేకాని శాంతించవు. ధర్మపూర్వకమైన కొన్ని కోర్కెలు కలిగి ఉండటం మంచిదేకాని అతిగా కోర్కెలు పెంచుకోకూడదు. శక్తికి మించిన కోర్కెలు మన బుద్ధిహీనతను తెలియజేస్తాయి. కోర్కెల విషయంలో మన ఆదర్శపురుషుడు శ్రీ కృష్ణుడు చెప్పిన విషయాలు మరల

మరల మననం చేయతగినవి. ముఖ్యంగా భగవద్గీతలోని రెండవ అధ్యాయం సాంఖ్యయోగం స్వాధ్యాయం చేస్తూ ఉండాలి. స్థితప్రజ్ఞత్వాన్ని అలవర్చుకోవాలి.

**శ్లో॥ ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశన్తియద్వత్ ।**
**తద్వత్ కామాయం ప్రవిశన్తి సర్వే సశాన్తి మాప్నోతి న కామకామీ ॥**

– భగవద్గీత (2-70)

తా॥ ఏవిధంగా జలపూర్ణములైన నదులెన్నివచ్చి తనలో కలిసినా సముద్రం నిశ్చలంగా తన పరిధిలో తానున్నట్లు ఆత్మజ్ఞాని తన మనస్సులో కోరికలెన్ని కలుగుచున్ననూ చలించక స్థితప్రజ్ఞుడై ఉంటాడు. అట్టి జ్ఞాని సదా శాంతినే పొందుతాడు. భోగాసక్తుడు శాంతిని పొందలేడు. కనుక, శాంతిని పొందగోరు మనం కోరికలను తగ్గించుకోవాలేకాని పెంచుకోకూడదు. ఈ సూచనలను పాటిస్తే మనం తేలికగా ఆధ్యాత్మిక దుఃఖో పశమనాన్ని - శాంతిని పొందగలం.

**2. ఆధిభౌతిక దుఃఖాలు :** ఇతర ప్రాణులద్వారా వచ్చే కష్టాలను, నష్టాలను ఆధిభౌతికి దుఃఖాలంటారు. దొంగలు, దోపిడిగాండ్రు, హంతుకులు, శత్రువులు మొదలగు మానవులద్వారాను; పాములు, తేళ్ళు, జెఱ్ఱిలు, విషకీటకాలు మొదలైన ప్రాణుల ద్వారాను వచ్చే కష్టాలను బాధలను ఈ వర్గంలో చేరుస్తారు. మనం సరియైన దారిలో సరియైన పద్ధతిలో ప్రయాణం చేస్తున్నా వెనుకనుండికాని, ముందునుండి కాని ఎవరైనా వచ్చి ఢీకొంటే ప్రమాదాలు జరుగుతూ ఉంటాయి. వీటిని కూడా ఈ వర్గంలో చేర్చవచ్చు. వీటికి మన అజాగ్రత్త కొంత, ఇతర ప్రాణుల క్రూరత కొంత కారణాలుగా ఉంటాయి. కనుక మనం సదా మన జాగ్రత్తలో మనం ఉండాలి.

**3. ఆధిదైవిక దుఃఖాలు :** దైవవిధిచే కలిగే అతివృష్టి, అనావృష్టి, అతిశీతము, అతితాపము, తుఫానులు, భూకంపాలు, పిడుగులు, అగ్నిప్రమాదాలు మొదలైన దుఃఖాలను ఆధిదైవిక దుఃఖలంటారు. వీటిని దైవవిధిగా భావించి ఉపశమన మార్గాలను ఏర్పరచుకోవాలి. సహజ మృత్యువుకూడా దైవవిధియే. ప్రారబ్ధం పూర్తయినవారు వెళ్ళిపోతూవుంటారు. వాళ్ల ఆయువు అంతేఉందని సరిపెట్టుకోవాలి.

అయినవారు, మనను అభిమానించేవారు మరణిస్తే మనకు దుఃఖం ముంచుకు

వస్తుంది. బేలవలె విలపిస్తాము. అంతవరకు మనమధ్య గడిపిన వ్యక్తి ఇక మనకు కనబడదు అంటే విచారకరమైన విషయమే. కానీ, మనం ఏమీ చెయ్యలేము. కనుక అట్టి సమయాలలోనూ యోగేశ్వర శ్రీకృష్ణుని వచనాలు మనకు దుఃఖోపశమనం కలిగిస్తాయి. ఆ సమయంలో భగవద్గీతను చదువుతూ ఆ విషయాలను మననం చేయాలి - లోతుగా ఆలోచించాలి.

**శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యుః, ధ్రువం జన్మ మృతస్య చ ।**
**తస్మాద్ అపరిహార్యేఽర్థే, న త్వం శోచితుమర్హసి ॥** భ.గీ. (2-27)

తా॥ లోకంలో పుట్టిన ప్రతీప్రాణీ మరణించక తప్పదు. అట్లే మరణించిన ప్రతీప్రాణీ క్రొత్త శరీరాన్ని ధరించి జన్మించక తప్పదు. తప్పింపరాని ఈ సృష్టి నియమం ఇట్లుండ నీవు శోకించుట తగదు.

మనకళ్ల ఎదుటే ఎన్నో ప్రాణులు పుట్టుట చచ్చుట చూస్తున్నాము. ఇది అందరికీ అనుభవైకవేద్యమే. మన తాతలు, ముత్తాతలు మరణించారు. మహాపురుషులు మహాత్ములు కూడా మరణించుట చూస్తున్నాము. కాని, మరణించిన ప్రాణి మరల క్రొత్త శరీరంతో పుట్టుననే విషయం వేదశాస్త్రాల ద్వారా మాత్రమే తెలుస్తుంది. అయినప్పటికీ జాగ్రత్తగా ఆలోచిస్తే మన బుద్ధినేత్రానికి కూడా ఈ విషయం తెలుస్తుంది. కొందరు బాల్యంనుండే మేధావంతులుగా, కళాకారులుగా, ఆలోచనాపరులుగా వికసిస్తున్నారు. స్వల్ప సాధనతోనే ఉన్నతోన్నత శిఖరాల నందుకుంటున్నారు. కొందరు చాలా ప్రయత్నించినా అంతంత మాత్రంగా ఉంటున్నారు. దీనికి కారణ మేమిటని ఆలోచిస్తే పూర్వజన్మలలో వారు ఆ యా సాధనలు చేసివుంటారని అవగతమౌతుంది. ఇంతేగాక, కొందరు పుట్టుకతోనే పేదవారుగా, రోగులుగా, వికలాంగులుగా, మంద బుద్ధులుగా ఉండుట చూస్తున్నాము. కొందరు ఆగర్భశ్రీమంతులుగా, ఆరోగ్యవంతులుగా, బలవంతులుగా, బుద్ధిమంతులుగా పుట్టుటయు చూస్తున్నాము. దీనికి కారణమేమిటి? సృష్టికర్త ఎంతమాత్రం పక్షపాతం చూపని న్యాయమూర్తి కదా! దయాళుడు కదా! కనుక వీటికి కారణాలు పూర్వజన్మలో చేసిన పాప పుణ్యకర్మలు, సాధనలేనని అర్థమౌతుంది. అరుదుగా పూర్వజన్మ స్మృతులు

కలిగిన పిల్లలు పుట్టుటయు, పరీక్షించగా వారు చెప్పుచున్నవి సత్యములనియు తెలియచున్నది. ఇట్టి విషయాలు కూడా **"ధ్రువం జన్మ మృతస్య చ"** అనే వైదిక సిద్ధాంతాన్ని బలపరుస్తున్నాయి. ఈ విధంగా ఆలోచిస్తే అయినవారి మరణం, ఆప్తుల మరణం మనను ఎక్కువగా బాధించవు. శాంతి కలుగుతుంది. శ్మశానవైరాగ్యం కలిగి దాన ప్రవృత్తి జాగృతమౌతుంది. మనం కూడా ఏవైనా మంచిపనులుచేసి పుణ్యం మూట కట్టుకోవాలనిపిస్తుంది.

ఈ విధమైన ఆత్మప్రబోధాలవల్ల కలిగే శాంతి సామాన్యమైనది. కొంతకాలమే ఆ శాంతి ఉంటుంది. మరల ఏదైనా కష్టం సంభవించినపుడు అశాంతి కలుగుతుంది. మరల ఆత్మబోధ అవసరమౌతుంది. దీనికన్న శాశ్వతశాంతి, పరమశాంతి మరొకటుందని మహర్షులంటారు.

**నిత్యోఽనిత్యానాం చేతనశ్చ చేతనానామ్, ఏకో బహూనామ్ యో విదధాతి కామాన్।**
**త మాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః, తేషాం శాంతిః శాశ్వతీ నేతరేషామ్॥**

- కఠోపనిషత్ (5-13)

"అనిత్యములైన ఈ ప్రాపంచిక పదార్థాలలో నిత్యమైనది ఒకటి వ్యాపించి ఉంది. అట్లే, చేతనములైన అనేకమంది జీవులలోనూ మరొక గొప్ప చేతనం (పరమాత్మతత్త్వం) వ్యాపించి ఉంది. ఆ పరమాత్మతత్త్వం ఒకే ఒక్కటి. ఆ ఒక్కటే ఫలాలను కోరుతూ అనేక మంది జీవులు చేసే మనో వాక్కాయ కర్మలను పర్యవేక్షిస్తూ అత్యంత న్యాయంగా ఫలాలనిస్తున్నది. అట్టి పరమ తత్త్వాన్ని ఎవరు అంతర్ముఖులై కనుగొంటారో - తన అసలు స్వరూపాన్ని దర్శించి అనంతరం తనలో వ్యాపించి ఉన్న పరమాత్మను దర్శిస్తారో వారే శాశ్వతశాంతిని, పరమశాంతిని పొందుతారు" అని యమాచార్యులవారు తెలుసుకోగోరి వచ్చిన నచికేతునితో అన్నారు. కనుక మనం అశాంతిని దూరం చేసుకోవడానికి గట్టి ప్రయత్నం చేస్తూ యోగాభ్యాసం చెయ్యాలి. ముఖ్యంగా ధ్యానసాధన చెయ్యాలి. ఆత్మ పరమాత్మల సాక్షాత్కారం పొందటానికి ప్రయత్నం చెయ్యాలి. అది ఈ జన్మలో సార్థకంకాకపోయినా అది ఒక సంస్కారంగా ఏర్పడి వచ్చే జన్మలో చాలా సహకరిస్తుంది. అస్తు.

ఓ౩మ్ శాన్తిః శాన్తిః శాన్తిః

# శాంతి సాధన - నా అభిప్రాయం

కొక్కిరాల పూర్ణచంద్రరావు

ప్రశాంతమైన వాతావరణం, ప్రశాంతమైన మనస్సునే జీవులన్నీ కోరుకుంటాయి. ఎక్కువ కాలం ఈ ఆహ్లాదకరమైన పరిస్థితులలో హాయిగా గడపాలనేది అందరి ప్రయత్నం. చరాచర సముదాయం కూడా ఇదే కోరుకుంటాయి. ఆది మరియు అంతం కూడా ఎప్పుడు ప్రశాంతంగానే ఉంటాయి. మధ్యలోనే అలజడి మరియు అశాంతి. మన కోరికలు మరియు మన పనులే అశాంతికి కారకాలు.

ప్రతిస్పందించటం చైతన్యానికి సూచిక. ఈ ప్రతిస్పందనలోని ఆందోళన, అలజడి, ఆగ్రహము, భయము, దుఃఖము అశాంతి లక్షణాలు. రాగద్వేషాలు, ఈర్ష్యా అసూయలు జీవులలో అశాంతిని పెంచి పోషించే ఆహారం (గుణాలు) అని మన ఋషులు తెలియచెప్పారు. శాంతి - అశాంతి ఎక్కడో లేవు అవి మనలోనే ఉన్నాయి. ప్రకృతి ఆద్యంతము శాంత స్వభావమే. ఉదాహరణకు గాలి, నీరు, నిప్పు యొక్క ఉగ్రరూపాలు మనకు కొంత అశాంతిని కలిగిస్తాయి. కాని, ఇది అప్పుడప్పుడు కలిగే ప్రక్రియ. మిగతా అన్ని సమయాలలో ఇవి శాంతంగానే ఉంటాయి. చెట్లకు ఆగ్రహం వస్తే, రాయి వేసి కొట్టినవారి చెంప ఛెళ్లుమనిపించాలి, కాని చెట్టు ఫలాన్నిస్తుంది. జంతువులు, పక్షులు, కీటకాలు ప్రతిదాడి చేస్తాయి, కానీ మానవులు ఇంకా ఎక్కువగా, తీవ్రంగా ప్రతిస్పందిస్తారు. ఈ తీవ్రమైన ప్రతిస్పందనే అశాంతికి కారణం. పై వివరణ జీవులు ఉన్నత స్థాయిని పొందుతున్న కొద్దీ అశాంతికి అవకాశాలు పెరుగుతున్నాయని సూచిస్తుంది. ఇచ్ఛాను సారంగా. ప్రవర్తించే గుణమే (కోరికలు - పనులు) అశాంతికి కారణమని, నిగ్రహము - నియంత్రణే శాంతికి మార్గమని గీత బోధిస్తుంది.

అశాంతిలో ఉండటం మనం అలవాటుగా మార్చుకున్నాము. దీనికి అవిద్య, అజ్ఞానం కారణం అంటున్నారు మన తత్త్వవేత్తలు. అవగాహనతో అశాంతిని జయించవచ్చు, శాంతిని సాధించవచ్చు. దీనికొరకు అనేక మార్గాలను, నియమాలను వేదాలలో, యోగశాస్త్రంలో మరియు భగవద్గీతలో వివరించారు. శాంతి విలువను మరియు శాంతిని పొందే విద్యను తెలిపే చిన్న ప్రయత్నమే ఈ పుస్తకం. ఈ మంత్రాలలో ఏదో ఉంది అని చిన్నప్పటి నుండి ఆకర్షించిన మంత్రాలు ఇవి. మా గురువుగారు నన్ను దీనిలో భాగస్వామివి కావాలని ఆదేశించటం నాకు ఒక వరం. నాకు మార్గదర్శనం చేస్తూ, నిరంతర నా అభ్యున్నతికి అవసరమైన ప్రోత్సాహాన్నిస్తూ ఈ అవకాశమిచ్చిన మా గురువుగారి పాదపద్మములకు నమస్కరిస్తూ......

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

వేదాలలో సూర్యకిరణ చికిత్స (40-00), వేదాలలో జలచికిత్స (20-00), వైదిక క్రాంతి పథం (15-00), అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము (15-00), దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణిస్త్రీ) (20-00), అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (20-00), గర్భధాన విజ్ఞానము (30-00), మానవ ధర్మము (20-00), అశ్వినీ దేవతలు (20-00), సంధ్యా వందనము - వైజ్ఞానిక సమాలోచనము (20-00), అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము (30-00), గంగాధర శివుడు (5-00), గోమాత (30-00), గాయత్రీ విజ్ఞానం (50-00), జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ (60-00), స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు (10-00), దైనిక అగ్నిహోత్రవిధి (4-00), మన ఇతిహాసం (70-00), మన వేదశాస్త్రాల పరిచయం (50-00), చతుర్దశ భువనములు (10-00), ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ (10-00), యుగపురుషుడు శ్రీ కృష్ణుడు (8-00), వైదిక వివాహ వైశిష్ట్యము (8-00), ధర్మవీర్ పం. లేఖరామ్ (3-00), వేదాలలో అప్సరస గంధర్వులు (2-50), యజ్ఞోపవీత వైశిష్ట్యము (2-00), లక్ష్మీ సూక్తము (2-00), శాంతి ప్రార్థన (2-00), దగ్రేట్ గాయత్రి (2-00), వైదిక అర్థనీతి (2-00), బ్రహ్మచర్య విజ్ఞానము (15-00), శ్రీ దయానంద హృదయము (12-00), స్వరాజ్య సంగ్రామంలో ఆర్యసమాజము (8-00), సత్యధర్మవిచారణ (6-00), వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమం (10-00), మరణానంతరం జీవుని ప్రయాణము (40-00), ప్రణవ స్తోత్రం (10-00), అహల్య రాయిగా మారలేదు (2-00), దయానందుని ఆదర్శరాజ్యం (1-00), మాతాపుత్రికల జ్ఞానచర్చ (60-00), వేదాల వెలుగు చూపే ఆర్యసమాజము (20-00), వైదిక సరస్వతీ స్తోత్రమము (10-00), అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం (60/-). పెండ్లినాటి ప్రమాణాలు (40/-), వేదాలలో వర్షేష్టి విజ్ఞానం (25/-).



## నిత్యశాంతి ఏలా లభిస్తుంది?

నిత్యో నిత్యానాం చేతనశ్చ చేతనానామ్
ఏకో బహూనాం యో విదధాతి కామాన్ ।
తమ్ ఆత్మస్థం యే+అనుపశ్యంతి ధీరాః
తేషాం శాంతిః శాశ్వతీ న+ ఇతరేషామ్ ॥

- కఠోపనిషత్తు (5-13)

ఆ 'విశ్వాత్మ' నిత్య పదార్థాలలో విశేష నిత్యపదార్థం. చేతనులలో అంటే - జ్ఞానంకలవానిలో విశిష్ట జ్ఞానం కలది. అదియే జీవాత్మల అనేకానేక కోరికలను తీర్చటానికి సృష్టి స్థితి ప్రళయాలు చేస్తున్నది. వారివారి కర్మలను బట్టి జీవులకు జాతి ఆయు భోగముల నిస్తున్నది. అట్టి విశ్వాత్మను ఏ ధీరులు - ధ్యానశీలురు అంతర్ముఖులై ఆత్మ విశ్వాత్మలను దర్శిస్తారో వారే శాశ్వత శాంతిని - నిరంతర శాంతిని పొందుతారు. మిగిలిన వారు పొందలేరు. (మిగిలిన వారు కొంతకాలం మాత్రమే శాంతిని పొందగలరు).

He (God) is eternal among many eternals, conscious among many conscious beings (i.e. Jeevas), who fulfills the desires of all Jeevas (according to their Karmas). Those wisemen who see him seated within their souls eternal peace is theirs, not of others.

*Note : This verse clearly shows that the numerous Jeevas or souls are also eternal & conscious like God. But God is infinite while souls are finite. Again God is transcendent bliss or happiness, while the souls derive happiness from God. So souls are distinct from God not identical with him.*

# VEDIC SHANTI PAATAM

Price : 20/-




ఓం శం నో దేవా విశ్వదేవా భవన్తు
శం సరస్వతీ సహధీభిరస్తు ।
శమభిషాచః శమురాతిషాచః
శం నో దివ్యాః పార్థివాః శం నో అప్యాః ॥

– ఋగ్వేదం (7-35-11).

మా దేవతలు (విద్యాంసులు) విశ్వదేవత లగుదురుగాక! విశ్వకళ్యాణ కారకు లగుదురుగాక! మా సరస్వతి (విద్యలు) వివేకవంతములు, విజ్ఞానవంతములు అగునుగాక! లోకమునకు మరింత ప్రయోజనములు కలిగించు నూతనావిష్కారములు చేయునుగాక! మా ఋషులు, మునులు, సాధుమహాత్ములు మంచి ఉపదేశములనిచ్చి మమ్ము ధర్మాత్ములను, ఐశ్వర్యవంతులను, త్యాగులును చేయుదురుగాక! పృథివీ జల వాయువులు, అందలి పదార్థాలు, ప్రాణులు అన్నియు మాకు సుఖశాంతులను కలిగించునవియే అగునుగాక!

May the educators, specialists in various branches of learning, work for our welfare. May we attain knowledge in its various cultural and intelluctual aspects. May those who have realised the self and whose life is continuous sacrifice, and others who feel pleasure in dissemenating knowledge and giving wealth in charity bring bliss to us. May we succeed in controlling and deriving full amount of happiness from the beautiful produce of land and waters.

Published by :

**GAYATRI ASHRAM TRUST**

12-10-586/6, Arya Samaj, Medibavi,
Warasiguda, Secunderabad - 500 061. (Telangana)